ఓం

# త్రివేణీ సంగమ సంగీత తరంగిణి

యను

# క్షేత్ర ప్రశంసమాల

---


( ర చ యి త లు )

కర్నూల్ జిల్లా (ఆంధ్ర) వాస్తవ్యులును ప్రస్తుత నివాసము హైద్రాబాద్ జిల్లా షాబాద్ తాలూకా సర్దార్ నగర గ్రామ నిలయులగు శ్రీ మహమ్మద్ అబ్దుల్ రహమాన్ ధడాఖ జ్యేష్ఠపుత్రుండును శ్రీ కుమారస్వామి యతివరుల ప్రియశిష్యుండునగు మహమ్మద్ అబ్దుల్ అజీంధడాఖ గారి కవిప్రణీతంబయ్యె,

ప రి శో ధ కు లు

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా వైదపుర నివాసులగు వే॥ బ్ర॥ శ్రీ ఘటము సత్యనారాయణ శర్మగారిచే పరిష్కరింపబడినది.



( ప్ర కా శ కు లు )

కీ॥ శే॥ తాటివీరమల్లయ్యగారి కుమారులు శ్రీ తాటి యెల్లయ్యగుప్త బట్టలవర్తకులు తాలూకా షాద్ నగర్ మరియు సర్దార్ నగర్ గారి ధనసహాయ్యమున ప్రచురింపబడియె.

శ్రీ హేవళంబి సం॥
వైశాఖ శు॥ ౧ మీాలు
ది 1–5–1957

మొదటి కూర్పు
(౧౦౦౦) ప్రతులు.

ఓం

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణేనమః

# ఉపోద్ఘాతము

ఉ॥ జ్ఞానము తెల్పుచే కవన పద్ధతియందు ప్రసంబుసందుసన్
జీవనముసంపుచ్చ్యము నిచిక్ కళలందు పసందుజెందు మేల్
త్రోవయు త్రోవబోవ తోలుతో ల్లసప్రట్టిన తాపు తావులో
పావరమైన సత్కవన భారనుదూరము సేతురా బుధుల్॥

కం॥ లింగశరీరములోని య । మాంగల్యము శుద్ధగానుట
మానుషధర్మం । బంగములోపలి యమునా
గంగాస్నానంబెదాని కర్తృత్వమిలన్॥

కం॥ వాణియు యమునయు గంగయు
ప్రాణులలోనదులునాచు ప్రాబిలుకులతో
వీణానాదముసేయ పు । రాణీకులు
శృతులవినరు లక్షమిపుగమిన్॥

వ॥ నిర్వికార నిరంజన మనోరంజితులగు మహాశయులారా జీవులకు జీవనము పావనమైన జీవనమే. జీవనమనగా నీరు ప్రతిమాలిన్యమును పరిశుద్ధి జేయుటయేగాక బలము తేజము ఆయువు ఆరోగ్యము ధైర్యము కళ కాంతి బుద్ధి ఆలోచనా శక్తుల నిచ్చుటకు ప్రతిమానవునకు ప్రధానమైన వస్తువ. అట్టినీరు వట్టిపోవక కట్టుబడక బహుళమునై ప్రవహించునది నది. నదు లసంఖ్యాకములు పుణ్యప్రదములు అట్టి నదుల మునింగిన మానవుల మేనుల పూసిన ధూళిధూసరితములను పోగొట్టుటయే గాక పుణ్యమును కూడనిచ్చును. అందు ముఖ్యము గంగా యమునా సరస్వతులు అవి పరోక్ష

ములు, అపరోక్షములని రెండు విధములు కన్పించుట కన్పిం
చకపోవుట. కనుగొనునవి నేత్రములు అవి రెండు విధములు.
చర్మచక్షు జ్ఞానచక్షు జ్ఞాననేత్రము కాయశోధనకు కంచు
కాగడ. అది ఆధారచక్రము మొదలు సహస్రారమువరకు
కలిగిన డెబ్బదిరెండు వేల నరముల ప్రాణత్రాణ స్థానములను
గల కళల కనిపెట్టుచుండును. దేహము లోగల గంగాయమునా
సరస్వతీనదుల నదీగనంబుల దేహికి అనుభవము చేయుచుం
డును. కాయములో మనోబుద్ధి చిత్త అహంకార సంధులన్గల
అజ్ఞాన మాయామూర్తైక త్రిమలముల శుద్ధిచేయుచు త్రిగు
ణంబుల గుణకర్మలంటనీక దేహికి ఉదాహరణంబులు తను
వులో కనుపింపజేయుచుండును. జ్ఞాననేత్రాగ్నిమును గురుపద
బాలభాస్కరోదయముచే కని గంగా యమునా సరస్వతీ
నదుల ప్రతినిమేషము స్నానము చేయ నెరిగి ఆబలమున
త్రికూటస్థాన మెక్కగలిగి కోటి సూర్యప్రభా భాసమైన
నొక్కగోటినిగాంచి ఆమె నోటిమాటలువిని అవి కొన్నిపాట
లుగా నేనుచెప్పుచూనినందులకు ప్రాజ్ఞులైనవారలు సంతసింతు
రేమో అజ్ఞులైనవారలు నిరసింతురేమో దూషణ భూషణ
తిరస్కారంబులుశరీరంబునకుగాని ఆత్మకులేవు. వానితో నాకు
పనిలేదు.

ఇట్లు విన్నవించు

విబుధపద విధేయుడు

మహమ్మద్ అబ్దుల్ అజీంధడాఖ

# పరిశోధకాభిప్రాయము

క॥ పరిశోధననే జేయుట । పరిశోధించుటలుగాదే
ప్రణవము అదినా । అరచేతనున్నదా హరిహర
సరసీజోదరులకు అందనిదిగదా॥

క॥ పరిశోధననే జేయగ । కరువలి స్తంభించి కంచు
కాగడగొనిమై । మరుగుల తిరిగెడి యాతల । వరినా
మెరుగులనుదిద్ద వరగణపతినా॥

క॥ పరిశోధననే జేసితి । పరిపూర్ణంబైన బ్రహ్మ
భవనముముందున్ । దిరిగెడిసదుల మునింగెడి ।
తరుణుల తనువులను తళ్కు । తళ్కులనెల్లన్॥

ఉ॥ భావకవిత్వమిద్ది పొరపాటులుకల్గిన కల్గవచ్చుమై
దేవళమందు దేవుని మదిన్గనిపింపగజేయు శబ్దముల్
తావులుతప్పవచ్చు కవితావనితామణి బ్రహ్మపూరి
సంభావితపుష్పలావికగ బల్కగదా అదిచాలదా కళల్॥

ఉ॥ ఒల్లనికూరయుప్పనెడు యూహదలంపక తల్లిచంక
జాబిల్లినిచూచుబాలకుని ప్రేముడిగాంచితిదీనినేను
నేపొల్లులుకానరావు పరిపూర్ణరసామృతమూచు సత్కళా
వల్లికలల్లియుండె కొదువల్ గిదువల్ మదిమెంచబోక నా
చల్లనికాంతిలోమరగి । సాగిలిమ్రొక్కితి సంతసించితిన్॥

క॥ తాళముల రాగములతో । మేళనమై భక్తిరక్తి ।
మించెడుదీనిన్ । తూలికగజూచునరుడే ।
కూళసుమీ పగటిగుడ్ల । గూబయెజుమ్మీ॥

ఇట్లు
సుజనవిధేయుడు.
ఘటము సత్యనారాయణశర్మ వై.ద.



గ్రంథకర్త

అజీంధడాఖ

సర్దార్ నగర్

# త్రివేణీ సంగీత సుధా తరంగిణి

## ప్రథమ భాగము

### వినాయక స్తవము

1. కీర్తన—రా॥ మోహన॥ తా॥ ఝంప.

శ్రీ గిరిజావరకుమార శ్రితజనామనోవిహార
నేరమెన్నబోకుర నెరనమ్మియున్నవాడరా
మొరవినర శిసులిడర పరమకృపాకరగణేశ ॥శ్రీ॥
ప్రాకటమునిజనమన విభ్రాజితమత్ప్రభువర
ఏకదంతరానెరా ముల్లోకనేత నీవెరా
సాకుమురా ప్రోకుమురా నీకివె ప్రణుతులుగణేశ ॥శ్రీ॥
కేలుమోడ్చి నీపదముల మ్రోలనిలచియుంటిరా
జాలమువలదంటిరా భవజాలము లెడబాపరా
బాలుడరా ఏలగరా జాలవదేలరగణేశ ॥శ్రీ॥
ధారుణి సద్గారనగర దాసాళిం ప్రేమమీర
కోరినిన్ను వేడెనురా కోరికలీడేర్చరా
బ్రోవుముర కావుముర భూరిదయామయ గణేశ ॥శ్రీ॥

### సరస్వతీ స్తవము

2. కీర్తన—రా॥ కల్యాణి॥ తా॥ రూపకము॥

శ్రీకరవరనీలవేణి శ్రితజనావనీ శర్వాణి ॥శ్రీ॥
పరమేష్ఠిరాణి పరమ పావనిజననీ
సరసిజలోచని పాపవిమోచని

సకలభక్త మోక్షప్రదాయని
సురుచిరవీణా నాదవినోదిని
సురనరాది సత్కీర్తిందప్రపోషణి ॥శ్రీ॥
భారతిమాంపాలయామి భవ్యరూపిణి భవాని
ధారుణీసద్దారునగర పురవిహారిణి
సారసమణిమయ హారభూషణి
సరసనుగుణ సత్ప్రకాశిని
సూరిమిహిరాగ రాజాజీం కవి
ఘోరకలుష సంతాపనివారణి ॥శ్రీ॥

ఈశ్వర స్తవము

3. కీర్తన—రా॥ కల్యాణి॥ తా॥ రూపకము

గౌరీనాథ ప్రణవాకృత
త్రిపురాంతకమహాదేవ ॥గౌ॥
కారుణ్యాత్మక ప్రభువర
కామిత దాయక చిద్విలాస
పరమోద్ధర భవవిదూర
భాసుర రజితాద్రివాస
ఫాలనేత్రమాం పాలయ

రామచంద్రమూర్తి స్తవము

4. కీర్తన—రా॥ నాదనామక్రియ॥ తా॥ ఆది॥

శ్రీరామప్రభువరరావేరా । నామనమునని న్నెరనమ్మితిర ॥శ్రీ॥
నీమహిమలు తెలియగజాలనుర । నీవేగతియని మొరలిడితినిర
కామాదిషడ్గుణవిదూరసదా। కాపాడుచుండుముపరాత్పర॥శ్రీ॥

సాకేతనిలయరఘుకులవీర । సాయుజ్యపదవి చేకూర్చుమురర
కాకాసురమదహరరణధీర । కారుణ్యసాగర రమావర ॥శ్రీ॥
సీతాంగనహృదయకమలలోల।పరంజ్యోతిస్వరూపాగమమూల
వాతాత్మజపూజితపదయుగళ । వాణీశనుతాశ్రితజనపాల ॥శ్రీ॥
ధారుణీసద్గార్ నగరవర । ధామాజీం దాసభవభయహర
క్షీరాబ్ధిశయనజగదాధార । క్రూరాసురరావణసంహార ॥శ్రీ॥

సద్గురుమూర్తి స్తవము

5. కీర్తన–రా॥ కేదార॥ తా॥ ఏక॥

గురుచరణములకువందనం।మద్గురు॥మరువకచేసెద ప్రతిదినం॥గు॥
గురుచరణములీహృదయమునందున
స్థిరముగనిల్పియు వదలియుఅహం ॥గు॥
దుర్గుణములుబహు వదలగజేసియు
సద్గుణములుమది నిలుపగజేసెను ।శుభం శుభం ॥గు॥
తారకమంత్రప్రభావము తెలిపెను
తరించెమార్గము గ్రక్కునచూపెను। నిజం నిజం ॥గు॥
తనకరమునునా శిరముననునిచియు
మనమలరగనొక మంత్రము నేర్పెను । జపం క్రమం ॥గు॥
జపమిదిఅజపము త్రికూటిఇదియని
రూపమువిూరకనుగొనె । హంసాక్షరాక్షరం ॥గు॥
కోరికతీర్చెను గురువరుడు మదిగ
కోరిభజించుచునుండుమజీమికి । క్షణం క్షణం ॥గు॥

6. కీర్తన–రా॥ దేశిమిశ్రమ॥ తా॥ ఆది॥

నడునడువే ఇకనుడిబడకే। అత్రివేణీసంగము దాటవే
మడికట్టియు మదికికఓమనసా ॥నడు॥

పద్మాసనమును వేసియు బాగుగ । ఇటుఅటుకదలకకూర్చొ
ముద్రాశాంభవి పట్టియుగట్టిగ । ఊర్ధ్వముచూచుట నేర్చుకో
నీవూర్ధ్వముచూచుట నేర్చుకో
మదిగదిలో పదిలముతో
అదివచ్చేటిధ్వని వినునీవిక। మడికట్టియుమదికిక ఓమనసా ॥నడు॥
రేచకపూరకసుషుమ్న దారి । నడువడి నేర్చుకో వడిగా
నీచాఊచాపాదము లేయుచు । పోవలెకో డిబిడిపడక
నీచంచల మొదలీఅచట
అచలమనే స్థలమునసే
నిశ్చలతత్వముచూడవే। మడికట్టియుమదికిక ఓమనసా ॥న॥
భూచరిఖేచరిలక్షుశణ్ముఖి । ముద్రలునాల్గివిచూడు
ఎంచియుపంచుకోఐదవముద్ర । శాంభవిఅనునదిచూడు
ఈ శాంభవిముద్రనుచూడు
తిర్జనవు వేళ్ళకును
వుంచవెముద్రలపై ఇక । మడికట్టియు మదికిక ఓమనసా ॥నడు॥
సద్గురునగరులోనిలచెలజీము । నమశ్శివాయ ఓం యనుచు
ఊర్ధ్వమునడచేమార్గంబొవలక । పంపిణిస్థళమునుకనుచు
ఆ పంపిణిస్థళమును కనుచు
హరహరఓం శివశివఓం
అనుసహాయమొసగునేఈశుడు।మడికట్టియుమదికిక ఓమనసా ॥న॥

7. కీర్తన—రా॥ శివరంజని॥ తా॥ ఆట॥

సత్ప్రవర్తనఇదేనడతా । సత్యమే మనకర్మరా ॥స॥
రాగులేవై రాగులేగానీ। యోగులేమరిభోగులేగానీ
కర్మమొసలుట ఎవరివశమో

సత్యమేదశరథునితనయుడు । సత్యమునకై పాటుపడుటలు
పితయొసంగిన ఆజ్ఞదాటక । సతిసమేతముకానకేగెను ॥స॥
ద్రౌపతి సైరంధ్రియయ్యె । విరాటుకొలువులో నిలచియుండ
చూచుచుండియుపాండవులు । ఆధర్మకర్మనువీడినారా ॥స॥
అడవిలోసుడిబడుటయే । ఆనలుడుఖేదామొంది రూపము
మారుటే
దమయంతిభర్తనువీడినాడే । స్వయంవరముసకలియలేదే
తప్పెనాఆధర్మకర్మజగమునా ॥స॥
జ్ఞానిగానీజ్ఞానహీనుడు గానిజపతపబలుడుగాని
మానవుండైజన్మమెత్తియు । మానవలదు ఆజీముసత్యము ॥స॥

8. కీర్తన – రా॥ కమాచి॥ తా॥ ఏక.

దాటనునాఓడ దాటించుకృష్ణా
దాటించునాఓడ నన్నాదరించు కృష్ణా ॥దా॥
కృష్ణకృష్ణయనినిన్ను పదెపదేవేడుచుంటి
విష్ణుగోవింద ఈ విశ్వమందుగలుగుమాయా
విపులాబ్ధిదాటించు కృపనాదుపైననించు ॥దా॥
తనుమనుధనమంత నిండీయున్నదిఓడ
దీనబంధుదయాసింధు దిక్కునీవేరకృష్ణ ॥దా॥
డెబ్బదిరెండేండ్లు ఆయువుతో సుడిబడి
దబ్బునదాటించు ఇంక మునుగుతుందికృష్ణ ॥దా॥
మూడుసుడులమునుగబోవ మొగ్గియున్నాదినావ
తోడిచేసి భక్తులతో ఓడనులాగించుకృష్ణ ॥దా॥

నాయంత పాపిసరుడు జగమందు లేడుకృష్ణ
నీచెంత జేర్చి అజీం దాసుని బ్రోవుకృష్ణా ॥దా॥

9. కీర్తన – రా॥ శంకరాభరణము తా॥ తిశ్రగతి.

సాధించు ఓమనసా। శోధించు తారకం ॥సా॥
సాధన మెమంచి । సారమున్నది దీని నెగ్రోలుమ ॥సా॥
ఈడపింగళతిరుగ నేర్చి । జోడుజ్యోతులచూడ నేర్చి
మూడుకాల్వలు దాటనేర్చి । నడువడి నుడువడి విడువక ॥సా॥
మూడు వేణులసంగమున్నది । చూడహం సెటులాడుచున్నది
ఏడుకొండలెక్కిచూడు । జోడుఎవ్వడో జాడ తెలియును
మూఢత్వము విడుచుచు నీవు। గూడుచు ఆడుచు పాడుచు॥సా॥
ఆది అంత్యము తెలిసిచూడు । నీదినాదనిమాని యుండు
పాదు తెలసి గురువుగుట్టు ।బయలులో హాయలుగా
రయమున మేయిలో ॥సా॥
ఏ యే చోటలింగముండు ।మాయవదలిజ్యోతియుండు
కాయభంగము జేసితె అజీం । ఏమది ఈమది చూడది ॥సా॥

10. కీర్తన – రా॥ కన్నడ తా॥ ఆది.

తళాతళాతళుకుల తళుకులోనె మెరుపుల
ఫెళ్ళపెళ్ళయురుముల కానరేతనువుల ॥తళా॥
బంగారుతీగెవంటి మెరపు ఛాయకన్యా
శృంగారవతి అది వలపుఛాయకన్యా
గంగాయమునలో మనుసుదాటదామె
భృంగివలెతిరిగి అంగభంగమయ్యెపోమె ॥తళా॥

ఇడపింగళలో ఉయ్యాలలూగెనాతీ
మూడువేణులపై కులుకుచుండునాతి
రెండుజ్యోతులమిన్నా నాతిజ్యోతిఆమె
నడచి చూచుటకు దారిదొరుకదామె ॥తళా॥

ధనకనకావస్తువులను కోరదాకాంత
ధ్యానజ్ఞానజపతపసుల కోరుఆకాంత
తనలోనిలచియున్న కాంత తెలియదామె
కన్నవారు జూపుటకు కరుణకలుగదామె ॥తళా॥

ఇట్టికాంత చెలిమినీకు దొరుకబోదు ఓఅజీం
పట్టుగురువు పాదములను జూపగలడు ఓ అజీం
నష్టేటబుట్టనీదు మునిగిపోవనామె
పట్టిశ్చనాధుడెవడో కానరాడామె ॥తళా॥

11. కీర్తన - రా॥ శివరంజని తా॥ ఆట.

మనుజులంత మనములో కానరాత్మనాత్మల
మానరే పరనిందలా కానరేశివభక్తుల ॥మను॥
కన్నతల్లి తండ్రిసేవ జేయమతి భ్రష్టాయెనా
అన్నియాత్రలుతిరిగెఘనులు ఇలలోపెక్కండ్రున్నరే ॥
గురువునకు తనుమనుధనంబు దారబోసినవారలే
ధరలోదిరుగబుచ్చుకున్న శిష్యులధికములున్నరే॥మను॥
నీచులనిబహుదిక్కరింతురు చూచికొందరు బీదలా
వూచులాడలరు కాంతకనకము ఆశలోబడియున్నరే॥
విన్నకన్నవన్నివ్రాసిన నీవెఅన్నవు అందురు
ధ్యానజ్ఞానులు పాటవిని ఆనంధమొుంధుచుందురే ॥మ॥

ధరను సర్దార్ నగరమందున నిలచియున్న అజీముదాసు
గురుకుమారస్వామి శిష్యుడు వ్రాసెకీర్తన అందురే॥మ॥

12. కీర్తన - రా॥ దుర్గా॥ తా॥ ఏక.

రామధ్యానంబెకదా మనసజపం। ఓనీదువత్రితం ॥రామ॥
కామక్రోధంబులను కాల్పునదే రామజపం
ఓ రామజపం ॥రామ॥
రామునీనామము స్మరియించి కదా
రుషిమునులైరికదా నీదుజపముచేసిసదా
స్నానస్థానంబెకదా తెలసినిజం
ఓ చేసిజపం ॥రామ॥
గురువుబోధించెగదా తారకమంత్రిమునాడు
పరిపరివిధములతో సాధనజేసి చూడు
గురువుబోధించినదే గుట్టు ఇకపట్టుఅజీం
ఓ నీదుమతం ॥రామ॥

13. కీర్తన - రా॥ పుష్పతిలక॥ తా॥ రూపకము.

తెలియనైతినీ నీరూపురేఖరామ ॥తెలి॥
రామరామయనుటకిటుల । నామమెవరు పెట్టినారో
ప్రేమతో నీతల్లితండ్రి లేక । నీదు మామగారో ॥తెలి॥
నిన్నుజూచినట్టిఘనులు ।ఎవరున్ను తెలుపరైరి
విన్నశృతులు పలుకులన్ని। శూన్యరూపు రామయనుచు ॥తెలి॥
పటమునందు నీదురూపు ।దిట్టముగఎటువ్రాసిరిలలో
పట్టికాగితంబెకాదు తీర్చినారు ।శిలలురాము ॥తెలి॥

రామరూపుడన్నతప్పె ।రామనిరూపుడన్నతప్పె
ఏమిలోచదామెమదికి ।ఏమనందు తెలుపురామ ॥తెలి॥

ధ్యానజ్ఞానమొసగుమనుచు । దీనుడజీం ధడాఖయిటుల
నిన్నుమొరలిడుచు ధర । సర్దార్ నగరమందు నిలచె ॥తెలి॥

14. కీర్తన - రా॥ తోడిమిశ్రమ తా॥ ఆది.

వేగవేగమె ఇకా । త్యాగికావె ఓమనసా
మురళినాదమువినవె । నీవికా
అందు శబ్దము । వినికనుగొనవ
నీవినీ అననిదే । నేనెటులందును అందును
నీవును నేనును ఒక్కచోనున్నను । నున్నను
అన్నినున్ననెకదా । నరజన్మమెఇక
శబ్దమేమది ఇక తెల్పవ ॥వేగ॥
తొలుకులుకొట్టును । పలుకులు మునుగును।మునుగును
కులుకులు తొలుగును । ప్రేమలువదలును । వదలును
కిలకిలనవ్వులు । కల్లభ్రమలన్నియు
ఎల్లకాలమువుండు నావెన్నెల
అందుశబ్దమువిని కనుగొనవ ॥వేగ॥
ఎందరోపోయిరీ । వుందుమామేమిక । మేమిక
సుందరాకారులు । ముని ఘనజనులిల । జనులిల
ఉండుటకు ఓలజీం । సర్దార్ నగరమందున
ఈ ఆశలు ఇకవీడవా
అందుశబ్దమువిని కనుగొనవ ॥వేగ॥

ఇప్పుడే చేసుకో రామునీ ధ్యాన్నము
తప్పితేమతిస్మృతి వుండునాజ్ఞానము । జ్ఞానము
ఇప్పుడప్పుడెప్పుడో । ప్రాణిపెళ్ళిపోవుట
ఈజన్మక దొరుకదుసుమా
అందుశ్రద్ధమువిని కచుగొనవ ॥వేగ॥

15. కీర్తన - రా॥ మధ్యమావతి తా॥ ఆట.

గీతార్థసారముగ్రోలు । మనసా నీతినూతిలోమునిగితేలు ॥గీ॥
గీతచెప్పినదాత । నెరిగి । భీతితోధ్యానించుచుండు
మతము హిందుమతము మనదిది । సతిసుతాదులనేర్పుచుండు॥
గీతార్థమది భగవద్గీత । మామాత పితరులు చదువలేదా
గీతబోధచేసెనాడు । సత్యమేకద అర్జునునికి
సత్ప్రివర్తనలెల్లనేర్పి । ఆత్మనాత్మలో చూపెకృష్ణుడు ॥గీతా॥
పదునెనిమిదియునధ్యాయములు । పారాయణము చేయుట ।
మనధర్మములు
వదలకను బహుపదిలముగను । చదువుచుందురు ఘనులు
ఇలలో
ఆదిఅంత్యమధ్యరహిత । మర్మమెరిగిన భక్తులందరు ॥గీతా॥
శివకేశవపరబ్రహ్మ । ఎవరిధర్మమేదియో । నీదుకర్మ
ఎవరుహెచ్చోతచ్చు ఎవరో । ఎవరువచ్చుచు పోవువారలో
ఎవరుఎవరినిపూజజేతురో । ఎవరుఎవరిని కలసికొందురో॥గీతా॥
మత వాదములవన్ని మానీ । ఆత్మనెరుగు । విజ్ఞానముబూని
ప్రతిదినము ప్రణవంబున్ గల । శ్రుతినివినుచు ఆజీము అల్లా
స్థితినెరిగి సద్గారుజనపుర । జనహితుడు అజీంధడాఖ ॥గీతా॥

16. కీర్తన - రా॥శంకరాభరణం మిశ్రమ తా॥ అడ.

వాదమెందుకయ్యా । పాదుఎరుగవయ్యా । క్రోధము వద్దికపో
మనసాశిద్ధుల । సాధులతో ॥వాద॥
నీవు నేనుఎరుగా । మేనువదలితిరుగ । కనుగొన గురువులతో
మనసాత్వరగానీవికపో
జ్ఞానులైనవారలా । ఆత్మనాత్మబోధల । గానవేమోక్షముకై
హరిహరబ్రహ్మను । కూడుటకోరకై । ప్రాకవెత్రికుటికిపై
త్రివేణులమునుగక । మనసాదాటిపో ॥వాద॥
శివశివయని ఓం । నమశ్శివాయయని। సహస్రపురిజేరవెమనసా
అవనిలోతలువ । పలుకతులువై । కారణకర్తహారుడే
సర్వేశుడే అజీము । బ్రోవును । సద్గార్ నగరములో ॥వాద॥

17. కీర్తన - రా॥ కమాచి తా॥ జుల్వా.

ఇదేమదీకదా । సదా శ్రీరామమందిరం
పదేపదే ఓమనసా । అచట భజనచేయుదం ॥ఇదే॥
పొగడుటకును అలవికాదు । దానివందనం
పగలురాత్రి జపమునకది । ఏకాంతస్థలం ॥ఇదే॥
వెలుపలోకవృక్షమున్నది । దానివైభవం
పూలుపడురంగుల గలది । ఉద్యానవనం ॥ఇదే॥
సాధులంత ఉందురచట । వేసిఆసనం
ఖేదమొదలి రామధ్యాన । మందె అనుదినం ॥ఇదే॥
పాదుతెలియుటకును । గురు । సేవచేయవలె అజీం
ఖేదమొదలి భక్తుడవై । చూడుము నిజమందిరం ॥ఇ॥

18. కీర్తన - రా॥ దేశిమిశ్రమ తా॥ ఆది.

మననియవె । ననుకనుగొనవే । నామొరాలకించవె శ్రీహరీ
నినుతలచెటిజ్ఞానంబొసగుమిక ॥మన॥

మధురమధురమగు। రామునినామా। సారముగోలుటఎటులో
చేరుదునేనెటు తెరలోపలనీ । సదనముజూచుటఎటులో।
నీసదనముజూచుటఎటులో । మదిమైలే । అదిపోదే
మడిగట్టుచునున్నను।శ్రీహరీ।నినుతలచెటి జ్ఞానంబొసగుమిక॥మ॥

చంచలమొదలీ అచలంబొట । ఏమిటిదోనేనెరుగ ।
పంచాక్షరిమంత్రిము । అందుననోట । సాధనజేయుట ఎరుగ।
నేసాధనజేయుట ఎరుగ ।

జ్ఞానినో । నే । నజ్ఞానినో । నే ।
ఈషణత్రయములజిక్కితి । హరినినుతలచెటి జ్ఞానంబొసగుమిక॥

సర్దార్ నగరమువదలిఅజీము । త్రికుటాద్రెక్కుట ఎటులో ।
సహస్రపురమున త్రిలింగములను । దరిశించుట ఇకఎటులో ।
నేదరిశించుట ఇకఎటులో ।

సరగుననీ । దరిజేరే ।
సహాయమొసగ వెశ్రీహరీ । నినుతలచెటిజ్ఞానంబొసగుమిక ॥మన॥

19. కీర్తన- రా॥ దుర్గా॥ తా॥ ఆట.

గోవుమాంసముమనసా తిన్నావా । నీవుసారత్రాగియుసారము
కన్నవ ॥గో॥

గోవుమాంసముతినుచు । సారత్రాగు తెనీకు ।
శివకేశవులధ్యానజ్ఞానంబుగలుగును ।
గోవుక్షీరము పిదికిపిదప । క్షీరమందునతోడుపెట్టి ।
దధిమథించిరవితో వెన్న । తీసెవుపము నేర్చినావా ॥గో॥
గురువుపుత్రుడవయ్యి । యున్నావ। వారిఎదురుక్తముగ మొరుగు
చున్నావ ।
గురువుఆజ్ఞలోనిలచి । గురుగుట్టు సాధించి ।
సురలాసురులు రుషిమునిజన ఘనులైరి ।
మరువకుండిరి గోవుమాంసము । గ్రోలుచుండిరి సారసారము ।
వారికన్నఅధికమైన । వాడవా ఓ సెత్రిమనసా ॥గో॥
దాంగభక్తుడవయ్యి యున్నావా । ఇలలోకొంగజపముచేయు
చున్నావ ।
గంగాయమునలమధ్య । మునిగితేలవుగాని ।
సంగమహేశ్వరము । చేరుట ఎటులనో ।
అంగభంగముచేసినీవు । లింగమూర్తిని జూచుటెటులో ।
భృంగివయ్యి సహస్రకమలము । నందునిలుచుట నీవుఎపుడో॥
పొట్టకొరకై తిరిగేగురువులు । గుట్టుఎరుగరు నీకును తెల్పరు
పట్టుప్రజ్ఞానుండై యున్న । గురువుపాదము .
నోటమాంసము తినుచు । సారత్రాగుట నేర్పును
ఇట్టిధరలో పుట్టితిరిగే । గోవుమాంసము తినుటపాపము
చెట్టుమూలకములవెళ్లే । సారత్రాగుట పాపమండ్రు ॥గో॥
తర్కవాదములన్నినూనీ । తత్వమర్మంబెరిగినవాడే జ్ఞానీ
తుర్కమతమువాడు । అటం । నామమువాడు

సర్దార్ నగరమందు । ద్రాసెతత్వము యనుచు
మిత్రులందరు శతృలయ్యె । ముష్టియుద్ధము చేయబోకుడి
గురుకుమారస్వామిబోధ । సారమిటువలె తెల్పెదీనుడు ॥గో॥

## 20. కీర్తన - రా॥ దేశి తా॥ ఏక.

ఇద్దుగో సోహందండ । కొట్టచూడు । మాయలముండ
పెద్దలన్న బుద్ధిమాటలన్ని రద్దుచేసి
కొద్దికొద్ది సుద్దులు నా । వద్దచెప్పవచ్చినావు ॥ఇద్దు॥
ఉన్నచోటవుండలేవు । అన్నిచోట్ల తిరుగుతావు
అన్నవిన్నకన్నవన్ని । తెలుపుకుంట వురుకుతావు ॥ఇద్దు॥
తలుపుమూసి । చిలుకువేసి । తలుపులోనెయుండుమంటె
తలుపుతీసి బైటవచ్చి । తల్పులెల్ల తెల్పుతావు ॥ఇద్దు॥
హరిభజనచేసెవారి । హృదయమునందుజేరి
పరిపరివిధముల బుజ్జగించె ముండనీవు ॥ఇద్దు॥
ఇట్టిచర్య లొదలకున్న । పట్టిఅజీం కట్టునన్న
కొట్టికొట్టి తోడ్క_త్తీసి । ఏడ్చినగాని వదలడన్న ॥ఇద్దు॥

## 21. కీర్తన-రా॥ ఆనందభైరవి॥ తా॥ రూపకము.

ఎటువలెస్తుతిఇంతునిన్ను । కృష్ణా ।
శ్రీహరియనినే ॥నెటు॥

ఇంటిమింటిమధ్యనీవు । దండిపైనగుండుఎక్కి ।
వేడుకలలరగ వీణావాయించుచు ననుగాంచకున్న ॥ఎటు॥
నేనునేను యనెడునాదు । మేనునిన్ను గాంచదేమొ ।
నన్నునీవుగాంచుచున్న । మేను అష్టగించియుండు ॥ఎటు॥

ఒంటి స్తంభపు మేడయందు । రెండుద్వారములకుమీద ।
జోడుజ్యోతులందు జ్యోతి । వయ్యి నీవు వెలగుచుండ ॥ఎటు॥
భక్తులెల్ల భ్రమసియున్న । ముక్తికాంతను గలసినీవు ।
జ్ఞప్తిమరుపు స్వప్నమంమ । త్రికుటాద్రిపై దిరుగుచున్న॥ఎటు॥
నేను మేనువదలులోన । నిన్ను స్తుతిజేయునట్టి ।
ధ్యానజ్ఞాన మొసగజీము । మొరలిడెనిసు ఇటులకృష్ణ ॥ఎటు॥

22. కీర్తన–రా॥ కాఫిమిశ్రమ॥ తా॥ ఆది॥

సాకి॥ కాశిచూచీ । మధురచూచీ । తిరిగితియాత్రలుఅన్ని ।
ఎచ్చటప్రభువు । దొరకక నేను । వచ్చితిహరిననుబ్రోవు॥

చ॥ నీద్వారము నిలచినయోగీ ॥నీద్వా॥
కోరా నేనా తనుమనుధనము । దరిశనమిచ్చి బ్రోవునన్ను॥
మూడుమూళ్ళలోచిక్కి । చూడత్రికుటిఎక్కి ।
సుడిబడుచున్ననునే । సుడిబడుచున్ననునే ।
ఇడపింగళ । ఆ । సుషుమ్నదారి ।
నడుచుచువస్తివిరాట్ । నడుచుచువస్తివిరాట్ ।
కోర నేనాతనుమనుధనము । దరిశనమిచ్చి బ్రోవునన్ను॥
ధర్మకర్మలుచేసి । ధ్యానజపముచేసి
నినుగానకయున్న నే । నినుగానకయున్న నే
దరిశ భిక్షగై కొనిదీక్ష ।
చేసిఅజీముదాస్ । చేసిఅజీముదాస్ ।
కోర నేనాతనుమనుధనము ।దరిశనమిచ్చిబ్రోవునన్ను॥ద్వా॥
దీనబంధువునీవే । దయాసింధువునీవే
దీనశరణ్యుడవు । దీనశరణ్యుడవు ।

దోసిళ్లొగ్గి సద్గురుసగరులో ।
మొరలిడుచున్నను రా । మొరలిడుచున్నను రా ।
ఘోర నేనా తనుమనుధనము। దరిశనమిచ్చి బ్రోవుమన్న ॥ద్వా॥

23. కీర్తన-రా॥ మాయమాళవగౌళ॥ తా॥ ఆట.

నిక్కం సద్గురుమంత్రం । తిక్క లేపినదే ।
సత్యం । ఓంకారంబు । బిందై నిల్చినదే ॥నిక్కం॥
సోహం । కర్తవ్యం । పిక్క । పెర్గిమరువనిదే ।
స్పష్టం । చూచినవంటె । తిక్క లేచినదే ॥నిక్కం॥
నిత్యం । తారకమంత్రం । పఠనచేయనిదే ।
సత్యం । చూచినవంటె । బిత్తర కొట్టినదే ॥నిక్కం॥
గర్వంబొదలియుధర్మ । కర్మచేయనిదే ।
మర్మంబెరుగవు గురువు । శిక్షచేయనిదే ॥నిక్కం॥
సర్వం । తారకమంత్రం । భక్తులెరిగినదే ।
సూత్రం । వేదం । అజ్ఞం । అంతు తెలియనిదే ॥నిక్కం॥

24. కీర్తన-రా॥ యమునాకల్యాణి॥ తా॥ ఏక.

నీతో తెలిపితి ఇటువలె । నాగతి ।
సనుబోవ పెజననిరో । పార్వతి ॥నీతో॥
త్రిమూర్తులలో । నేనెవరిస్తుతించుదు ।
త్రికర్ణశుద్ధిగ । త్రిపురసుందరి । పార్వతి ॥నీతో॥
నిరూపమును । నేనెటుపూజింతును ।
హరిహరయనినే । నెవరికి మొక్కుదు । పార్వతి ॥నీతో॥
సమానులేకద । త్రిమూర్తులందరు ।
ఉమామహేశ్వరి । ఎవరినివదలుదు । పార్వతి ॥నీతో॥

ఓంశబ్దంబున । ప్రసన్నమయ్యెన ।
ఉకార । అకార । మకార । పురుషులు పార్వతి ॥సీతో॥
ముజ్జగములునిను । మొరలిడుచుండగ ।
నిజముగఅజేము । నిరతముసమ్మతి పార్వతి ॥సీతో॥

25. కీర్తన – రా॥ కాఫి॥ తా॥ తిశ్రగతి.

నేనెట్లుందునమ్మా । ఈవూళ్ళో ॥నేనె॥
నాదేమున్నదక్కా । ఈ వూళ్ళో ॥నేనె॥
నానాథుఁడుండేది । పంచభౌతికపట్నం
నవద్వారములబంగ్లా । ఆవూళ్ళో ॥నేనె॥
ఆబంగ్లకుచుట్టొక్కకోటున్నది
నాకోటలో । మధ్యాన బంగ్లున్నది
ఆత్మసాక్షాత్కారమైనట్టి వారంత
ఆత్మనాత్మతోగూడి । నాథునికంటారు। ఆవూళ్ళో॥నే॥
ఆబంగ్లకు । ఆరేసిమెట్లుండు
ఆమెట్లకు । ఆర్వూరు । అధికారులుంద్రు
అమనస్కమైయుండి । అజపగాయిత్రెరిగి
జపముజేసెటివారు । ఆవూళ్ళో ॥నేనె॥
ఆపురమందు । ఆర్వూరుచోరులు
పాపకారులు । ధీరులుశూరులు
ఆఆరుమెట్లెక్కి పోయెవారలనెల్ల
క్రిందికిపడద్రోచి । కొట్టుచుండెడివారు । ఆవూళ్ళో॥
నేనెక్కజాలకనమ్మా । ఆమెట్లు
అన్నిఇచ్చట పడుచున్న । ఇక్కట్లు

ఎన్నాళ్ళు బ్రతికున్న । కొన్నాళ్ళే ఈపూలో
చేర్చండిసన్నింక। ఆపూళ్ళో ॥నేనె॥

జోడుజ్యోతుల । జ్యోతిఅచ్చట
మూడువేణుల । సంగంబచ్చట
ఆడుచున్నది । హంస। ౨౧,౬౦౦। ఇరువైయొక్క అర్నూర్ల
చుట్టాది ఆపూళ్ళో ॥నేనె॥

నేనుండేది సర్దార్ నగరము
నేకోరదే సహస్రారము
నాకేమిభయమింక । గురువుకుమారస్వామి
చూపించగలడజీం । శివలీలనీకింక । ఆపూళ్ళో ॥నేనె॥

26 కీర్తన – రా॥ కన్నడ తా॥ ఆది.

తనతనతనువుల । మనుసుపలికె పలుకుల
వినివినిపీనుల । నవ్వారేజనులిల ॥తన॥

తనతనతత్వమును । తరచిచూడలేక
మానాభిమానమును । తానువీడలేక
నేనెనేననుచుండే । భూతముసోకె
జ్ఞానిని నేననుచు అజ్ఞానినైపోయె ॥తన॥

జననిజనకులపై । మనసువిసిగిపోయె
ధనకనకాలక్ష్మిపై । ఆశలధికమాయె
మనసా రామయనె । శబ్దమొదలిపోయె
తనకథయేఅజీం । దాస్ ఇటువ్రాసె॥ తన॥

27. కీర్తన - రా॥ ఖరహరప్రియ తా॥ ఆట.

ఏది బ్రహ్మ । బ్రహ్మం । ఏదితత్ । ఏదిత్వం
ఏది తెలుపుమనసా । బుద్ధి ఆత్మచిత్తం ॥ఏది॥
౧ సృష్టికన్నను మున్ను । సృష్టికర్తెవ్వడో
సృష్టిఅయ్యెనపిదప । కానరైతి ॥ఏది॥

ఏది నేనునీవు । ఏదిమనము కాము
ఏది నేనుదీవు । ఏకంబయ్యేస్థళము ॥ఏది॥
౨ సృష్టిసూన్యముకర్త । సర్వంబు సృష్టించె
నిష్ట ఎటులచేతు । ఇష్టముగను ॥ఏది॥

ఏదిస్నానస్థానం । ఏదిధ్యానస్థానం
ఏదిజ్ఞానాజ్ఞానం । ఏదిప్రాణాయామం ॥ఏది॥
౩ దృష్టికిక్రీలీల । విశ్వంబుగనిపించె
అదృశ్యమానని । వలికిరెల్ల బుధులు ॥ఏది॥

ఏది ఆఅజపగాయిత్రి । మంత్రం
ఏదిరాకపోకలయందుండె స్థళం ॥ఏది॥
౪ కష్టపడుటే కాని । నీసృష్టి కనుటకు
దృష్టి తెలియకమున్నె । మృత్యువచ్చు ॥ఏది॥

ఏదియోగాగ్నిచే । భస్మమావస్తువ
ఏదియే అంగంపై చేయుదంలేపనం
౫ సృష్టిలయకర్త ప్రభు । విరాట్పురుడవీవె ॥ఏది॥

ఏదిసున్న అర్థం । ఏది ఓంఓంకారం
ఏది శంభుమయం । ఏదిశంఖునాథం
౬ స్పష్టముగనిన్నుధ్యానించె । జ్ఞానమొసగు ॥ఏది॥

ఏది ఆది అంత్యం । ఏది వేదవాదం
ఏది సుశబ్దంబు । ఏదియోనిశబ్దం
ఇష్టమాకోరికె నెరవేర్చు । ఇదియొనొకటి ॥ఏది॥
ఏది భక్తిభావం । భక్తులకు వదనం
ఏది సత్తుచిత్తు । అజీం ఆనందం
అష్టభాగ్యంబు ఇదెగదా । అజీంధడాఖ ॥ఏది॥

28. కీర్తన – రా॥ కమాచి తా॥ ఏక.

గురు వేకదా । గురిచూపెగదా
గురుతు లేని ఓనమాలు నేర్పెగదా । హరి ॥గురు॥

గురుగుట్టుఇదీ । జ్ఞప్తివుంచుమది
గురువుగుట్టు కన్నమున్ను । ఓం మేకద । హరి ॥గురు॥

ఓం అక్షరంబిది । బీజాక్షరంబిడి
త్రిమూర్తులకు । జన్మస్థానమెకద । హరి ॥గురు॥

బఅర్ధమేమొఅది । నాఅర్ధమేమొ అది
మః శివయఃకున్ను । సున్నలేకద । హరి ॥గురు॥

పురాతనంబగు । హిందూమతంబిది
పూర్వకాలతరుణమిదియేకద । హరి ॥గు॥

నూమాతపితలంత । మాతాత తాతలంత
నామభజనచేసుకుంటు ! దాటిరేకద । హరి ॥గురు॥

సున్నఅరసున్నఅజీం । వున్నవిసర్గః అజీం
అన్నవిన్న కన్నగురుని । బోధయేకద । హరి ॥గురు॥

29. కీర్తన - రా॥ కల్యాణి తా॥ రూపకము.

మూడడుగులు । నడువజాల । ఏడుకొండ లెక్కు టెటుల॥మూ॥
తోడుఅయ్యె వెంకటరమణ । లాగుకోకొండలమీదనన్ను॥
మొదలిడగురుబోధచేసె । గురినిలుపుటసాజ్ఞచేసె
త్రికూటాద్రిపై తిరుగుమనుచు । శిరమున తనకరముమోపె॥
దిగువకుదిగివచ్చునపుడు । సొగసగు శృంగాటమధ్య
జగజగజ్వాలజ్యోతి । దిగులొందక రమ్మనెనను ॥మూడ॥
రాకపోక లెరిగించెను । కాకచల్యాలన్ని తెలిపె
ఏకధ్యాంధమది ఇదియని । ఏకమయ్యె స్థళముచూపె ॥మూ॥
అండపిండమనున దేమొ । నిండిన బ్రహ్మాండమేమొ
ఉండి ఉండ లేని దేమొ । దండిరహస్యమును తెలిపె ॥మూడ॥
ధర్మకర్మవదలవద్దని । అధర్మకర్మలొదలుమనెను
మర్మమెల్ల తెలిపెఘనుడు । శర్మకుమారస్వామిగురుయతి॥
వారిశిష్యుడీఅజీము । స్థిరముగ గురుపాదములను
శిరము యురమునిల్పితాను । సర్దార్ నగరమందెనిలచె॥మూ॥

30. కీర్తన - రా॥ తోడి తా॥ ఆది.

కారుణ్యాత్మక । పరమపురుష । శ్రీనాయక
కాపాడరారా ॥కారు॥
క్షీరాబ్ధిశయన మురహర
మురళీధర । దామోదర
వేగబ్రోవరారా ॥కారు॥
పరాశరాదిమునివర

పరమోద్ధర । వారిజోదర
దరిజేర్చవేరా ॥కారు॥

సర్దార్ నగరప్రభువర
కరుణాకర । సుగుణాకర
వరదాజీం । భవదూర ॥కారు॥

31. కీర్తన – రా॥ దుర్గా తా॥ ఆట.

తల్లిగర్భమునుండివస్తినీ । ఎల్లజనులకు శరణార్తిజేస్తినీ
అల్లామహాప్రభు । అంతఃకరుణేగానీ
అంతుతెలియనిజన్మ । ఈజన్మసృష్టించె
అంటుఅంటని । ముట్టుముట్టని । ముట్టునిలచియు ముద్దగట్టెను
అట్టిముద్దలో ఇట్టిజన్మ । సృష్టిజేసెను ఈశ్వరుండు ॥తల్లి॥

ఎన్నిజన్మములెత్తివస్తినో । నేనునరుడని ఇలలనిపిస్తినో
నేనునేననుచుండి । నామేనుఇటువచ్చి
నేనోతానోకానో । తనలోననింకెవరో
ముట్టులోనెపుట్టివస్తిని । ముట్టువెంటనెకట్టితెస్తిని
వట్టిభ్రమలేకాని । మేను । గొప్పమలమూత్రములగుంట॥

ఉచ్చస్థానమెనేననియంటవా । లేకనీచస్థానమెనమ్మియుంటవ
నీచులూచులు అంత । ఏదారివచ్చిరి
ఉచ్చస్థానమొలేక । నీచస్థానమోనీదు
వచ్చినట్టిదె నీచస్థానము । మెచ్చుచుంటివి మోహమునను
హెచ్చుతచ్చుఇందు ఏదో । చూడు జ్ఞానీవై అజీము॥తల్లి॥

22. కీర్తన - రా॥ పూర్ణకాంభోజి తా॥ ఏక.

విడ్వపురో । ఆశలన్ని । నెరసినకాని వెంట్రుకలన్ని
గడిచెలరువదిఐదేండ్లు । ఈడ్చుచున్న నరములన్ని ॥విడ్వ॥
రక్తమంత క్షీణమాయె । శక్తిఅంత తగ్గిపోయె
జ్ఞప్తిలేకుండనాయె । వణకుచున్న అంగములన్ని ॥విడ్వ॥
కండ్లుకానరాకుండాయె । పండ్లుకొన్ని వూడిపోయె
రెండునొప్పులధికమాయె । పీడిస్తున్నరోగములన్ని ॥విడ్వ॥
రామారామయనుటరాదు । తామసంబు తగ్గిపోదు
మమత్తై తెలేనేలేదు । భ్రిమలెక్కువాయెకొన్ని ॥విడ్వ॥
లొట్టలైనదౌడలమీద । సొట్టసొట్ట ముడతలన్ని
గట్టిగానె సబ్బురుద్ది । పెట్టుకున్న మొగ్గలన్ని ॥విడ్వ॥
సాధుసత్పురుషులతో । వాదుచేయవలదు అజీం
బీదసాదసజ్జనుల । తగులునీకు హత్యలన్ని ॥విడ్వ॥

33. కీర్తన - రా॥ ముఖారి తా॥ తిశ్రగతి.

బిక్షమొసగుమా । పక్షివాహన। శేషశయన। రక్షించుమా॥
బిక్షమడుగవచ్చియున్న । బిక్షగాని తప్పులెన్న
రక్షకులన్యాయమకాన । శిక్షచేయపూనియున్న
మి. బిక్షంబడిగిననాపై । దీక్షణమెందకుకృష్ణా
శిక్షకుబద్ధుడనేనా । పాండవపక్షపుకృష్ణా ॥బిక్ష॥
ధనముబల్లను । ఘనముగాను ధాన్యమివ్వ। నిన్ను వేడను
ధనధాన్యములివ్వ నన్ను । ధనికులు పెక్కండ్రుయున్న
నేనుఒకటికోరియున్న । మనసుననిను నిలుపుమన్న

మి. ధ్యాన్నమునిను నేజేసెటి । జ్ఞానంబొసగుము కృష్ణా
మానాభిమానమునీదే । నాదిదికాదికకృష్ణా ॥బిడు॥
నిన్ను విడువను । ఎన్ని ఇడుములొబడినను । నీదు పదము
లొదలను

దీనుడనై నేనజీము । మనసులున్న వన్ని యన్న
దీనపోషనీతో నేను । మనవి ఇటుల చేయుచున్న
మి. మూడుయవస్థలయందున నీవె । మెలుగుచుండవె కృష్ణా
జోడుగనుండె జ్యోతులమధ్యన । వీణాగానముచేయవె
కృష్ణా ॥బిడు॥

## 34. కీర్తన - రా॥ భీంపలాస్ తా॥ ఆది.

గురువుబోధచేసెగ । కోర్కెనెర వేర్చగా
తారకమంత్రప్రభావము తెలిపి । తరించెమార్గముచూపెగా
ఓ॥ వెర్రిమనసావింటివి । కంటివి । చంచలమొదలగ రాదా॥
చంచలమొదలగ రాదా ॥గురు॥

ఒకటిరెంటిమూటిని । ఏకముచేసివాటిని
రాకపోక ఆశలొదలి । ప్రాకుతి్రకూటము సూటిని
ఓ॥ త్రివేణిసంగమ మైదవరంగము । మనసాదాటగ రాదా
మనసా దాటగరాదా ॥గురు॥

ఆమవస్కంబని వొర్లెదవు । ఆత్మశుద్ధిగ జేయవు
ఆత్మానాత్మవిచారణ జేసి । అంతరాత్మను కానవు
ఓ॥ సత్వరజస్తమ । త్రిగుణాత్మవునై । దుర్గుణమొదలగ రాదా
దుర్గుణమొదలగ రాదా ॥గురు॥

ధర్మకర్మలుమానియు । అధర్మకర్మలు బూనియు
నాదుబిందుమర్మంబెరుగక । అధముడవై పోయెవు
ఓ॥ స్వప్నసుశు ప్తిజాగ్రితవస్థలో । మేల్కొతో కుల్కగరాదా
మేల్కొతో । కుల్కగరాదా ॥గురు॥
ద్వైతాద్వైతము రెంటిని । ముద్రాసనలు అన్నిటిని
ఊర్ధ్వముఖమై అజీమువుంచె । నాదంబినవచ్చంటిని
ఓ॥ అచలసమాధి నిశ్చలతత్వము । గురువుగుట్టిదికాదా॥
గురువుగుట్టుదికాదా ॥గురు॥

35. కీర్తన – రా॥ ఝుంజూటి తా॥ ఆట.

ఎవరంటెనేమి । ఎవరనకుంటెనేమి
అంటుండుమనసా । నేవింటుంట ఓం ॥ఎవ॥
రమ్మంటెవస్తుంట । పొమ్మంటె పోతుంట
రాకపోకలఅంటి । అంటుండు ఓం ॥ఎవ॥
వట్టిమూర్ఖుడనేను । అట్టిట్టుతిరిగితె
పట్టికూర్చునబెట్టి । అంటుండు ఓం ॥ఎవ॥
సృష్టిసూన్యముముందె
సృష్టి ఓం అయివుండె
సృష్టి తనలోదాచుకొనియుండె ఓం ॥ఎవ॥
పుట్టిరి ఓంయందు । విష్ణు ఈశ్వరబ్రహ్మ
సృష్టికెల్లను బీజమన్నారు ఓం ॥ఎవ॥
అంటుండు ఓంఅజీం । వింటుంట ఓంశబ్దం
ఝంటభృకుటిమనకు । అంటుండు ఓం ॥ఎవ॥

36. కీర్తన - రా॥ కాంభోజి తా॥ ఏక.

వాడేదూదేకులోడు చూడరన్న
వాడుమాయకాయలున్న । పత్తిఏకునన్న ॥వాడే॥
వాడుకూడ మానవుడు । వానికులముపింజరోడు
వానిపేరు వినరన్న । జ్ఞానిధ్యాని శిద్ధయ్య ॥వాడే॥
దండివంచి సింగిడిచేసి ।రెండుప్రక్కలసరిచేసి
వడిరెండుత్రాళ్ళుగట్టి । మూడుఏకము జేసినవాడు ॥వాడే॥
పత్తితీసి చూచిబాగ । విత్తులెల్లతీసివేగ
శక్తిగల్లగిరకయందు । కిర్రుకిర్రున త్రిప్పెవాడు ॥వాడే॥
తొమ్మిదితొర్రలతడక । నెమ్మదిగా ఆసనమేసి
దుమ్ముగల్లపత్తినెల్ల । దుమ్మూదు ల్పెటివాడు ॥వాడే॥
సిక్కమైనముద్రపట్టి । చక్కగనేకూర్చుండి
దృక్కుపై నెలక్ష్యముంచి । నిక్కినిక్కిచూచెవాడు ॥వాడే॥
నారాయణనరమువిూద । పరబ్రహ్మపిడిచేత
వరుసతోడదెబ్బకొట్టి । హరిఓంశబ్దంవిన్నవాడు ॥వాడే॥
ఏకినంతదూదితీసి । ఏకులొక్కరాసిచేసి
శోకములేనిరాట్నం । గురువుకుమారస్వామి
గురిచూపినట్టితత్వం । పరమభక్తులకెల్లఅజీం
దాసుడై విన్నవించే ॥వాడే॥

37. కీర్తన - రా॥ కీరవాణి తా॥ రూపకము.

వినుసటమది నాదుకృష్ణా । విన్నవించు నీదుమురళి ॥విను॥
కనులకునుకానరావు । ఎన్నడైనచిన్నికృష్ణ

గోవర్ధనగిరి నెత్తియు కృష్ణ । గొల్లలగోవులగాచినకృష్ణ
ద్వారపతి మొరవిని । సభలో । వలువలొసంగినకృష్ణ ॥విను॥

కనివినని దిపదవినీదు । కనుగొను టెటు నేనుకృష్ణ
కనుగొనునది అననేరదు । అనునదికనతరమకృష్ణ
తేరలో మొరలునువినెదవు కృష్ణ । తెరవదలిక ఇటు రాగ దేకృష్ణ
హరికరివరదుడవై తివి । మకరినిద్రుంచియు కృష్ణ ॥విను॥

ఘనులగుమునిరుషులందరు । నిన్ను స్తుతిఇంచిరట
ఎన్ని ఇడుములై నబడిరి । నిన్ను గానరై రికృష్ణ
ద్వారకపురమునివాసివికృష్ణ । తరమానిను కనుగొనుటకుకృష్ణ
అరమరలేక అజీముకు । వరములొసంగ వెకృష్ణ ॥విను॥

38. కీర్తన రా॥ భీంపలాస్ తా॥ ఆది.

గమనించిచూడుమనసా । ఘటమందు ఓంశబ్దం
అమనస్కమై తెమనసా । ఘటమందు ఓంశబ్దం ॥గమ॥

పాటించిచూడునీవు । సాటెంచువాడుఎవడు
నాట్యంబూపాటగీతో । ఘటమందు ఓంశబ్దం ॥గమ॥

సృష్టేమిలేకమున్ను । సున్నొక్కటుండె ననిరి
సూత్రింబుగనిన ఘనులే । ఘటమందు ఓంశబ్దం ॥గమ॥

సృష్టించెఈశ్వరుండు । సున్నందు ఓంశబ్దం
సృష్టిత్రిమూర్తులైరి । ఘటమందుఓంశబ్దం ॥గమ॥

అన్నిటికిబీజమైన । ఓం అక్షరంఅజీము
ఉన్నంతవరకు ప్రాణి । ధ్యానించు ఓంశబ్దం ॥గమ॥

39. కీర్తన - రా॥ బెంగాల్ తోడి తా॥ ఆట.

నాతిరాపఖ్యాతిరా । అది నూతిలో నెయుండురా
నీతికన్యకుమారి సొగసులో । హాయలుమీరియుండురా॥నా॥
రాదురా ఎటుపోదురా । అదినీటిలో నెఈదురా
సాదుమునిరుషి కోట్లజీవుల । సుఖములిచ్చుచుండురా ॥నాతి॥
నల్లరూపుది మెల్ల చూపుది । తెల్ల రేఖలుగలదిరా
కొల్లగనుజగ మెల్ల చూచుచు । వలపుచూపుచుండురా ॥నా॥
బోటిసూటికవాటమందున । నేటుగా నిలచుండురా
సాటివారలతోటి కులుకుచు । మాటలాడుచుండురా ॥నాతి॥
యోగినీ । అదిజోగినీ । అధిభోగినీయైయుండురా
రాగద్వేషులభోగినియున్నై । వారికాగిటయుండురా ॥నాతి॥
నారిరాసంసారిరా । హరిధ్యాన్నవతిఆచారిరా
మేరుగిరి ఇరుప్రక్కలందు । అజీనుచూచుచుయుండురా॥నా॥

40. కీర్తన - రా॥ హరికాంభోజి తా॥ ఏక.

ఓరోరి ఓడోడ । ఓడింక దాటించు
ఓరోరిఓడబాబు । ఆవలింక దాటించు ॥ఓరో॥
మూలధారముమీద । ముద్దుగా నెనడిపించు
మూలమెరిగి మేలికతో । చక్కగా నెనడిపించు ॥ఓరో॥
బ్రిహ్మాధారమీద । బెరబెరఎక్కించు
బ్రిహ్మాండమైనజలము । నుండి వేగదాటించు ॥ఓరో॥
అబ్బరోరబ్బఇది । మణిపూరకంబంట
గెబ్బరోరి తెడ్డేసి । అనహాతంబుతాకించు ॥ఓరో॥

అనహాతంబువదలివేగ । ఈశ్వరునిగుంటకడకు
తనుపుమనువుతోడఓడ । జీవిగడ్డదాటించు ॥ఓరో॥
పురముజేరిగృహమునందు । హరిపూజచేయుటకు
మొరచేయుచున్నడజీం । ఓడవొడ్డుతాకించు ॥ఓరో॥

41. కీర్తన – రా॥ దేవక్రియ తా॥ తిశ్రగతి.

దొమ్మరాటఆడాలెరా । ఓదొమ్మరోడ ।
గడెఎక్కిచూడాలెరా ।
దొమ్మరాటఆడుటకు । రొమ్ముబలమెసెయ్యాలె ।
డమ్ముడమ్మునడోలికొట్టి । కేకవేసిఎగురవలె ।
అంగభావమెరుగాలెరా ।
ఓదొమ్మరోడలింగమునెచూడాలెరా ॥దొమ్మ॥
గడెనుధరణిమీదపెట్టి । వడిమూడుతాళ్లుగట్టి ॥
కుడిఎడమకువరగనివ్వక । తొడపైనెచెయ్యితట్టి ।
చంగూనఎగురాలెరా ।
ఓదొమ్మరోడ । సంగతేమొఎరుగాలెరా ॥దొమ్మ॥
క్రిందడోలుకొట్టుచుండ । పొందుగానెమీదికెక్కి ।
అందరికినిఆటచూపి । ఆనందమొందచేసి ।
భృంగివలెయుండాలెరా ।
ఓదొమ్మరోడ । సంఘమునెవీడాలెరా ॥దొమ్మ॥
దిగువకుదిగివచ్చినపుడు । బిగపట్టితాళ్లకపుడు ।
ఎగదిగకనుచూడకపుడు । జిగిజిగిజవ్వాడెజ్యోతి ।
వొంగివొంగిచూడాకురా ।
ఓదొమ్మరోడ । భంగమయ్యిపొయ్యేవురా ॥దొమ్మ॥

దొమ్మరికినిదొమ్మరాట । సమ్మతిపిల్లలకాటపాట ।
నెమ్మదిగాదుఇళ్ళలోఅజీం । నీదుపాటమాటఝూట ।
గంగలోనెముంచాలెరా । ఈపాటమంచి ।
సంఘములోవుంచాలెరా ॥దొమ్మ॥

42. కీర్తన - రా॥ సురట తా॥ ఆది.

సాకి॥ రామునికథా । ఆత్మలోయున్నదీ ।
వీనులవినవదిఏలా । మనసా ॥రాము॥

పల్లవి॥ మనఆత్మనుఘటమునమరచీ । ఆరాముని వెతకుటఏలా।
రామునిధ్యానముచేయకమనసా । రామునిశోధన లేల ।
కామితఫలము । నిష్కామఫలితము ।
తామసగుణమునకానకజీము ।
నామరూపగుణరహితునివిడచి । నాశనమయ్యేవేలా।
మనఆత్మనుపీడవోయి । మనసాభ్రమలు ॥రాము॥

43. కీర్తన - రా॥ నాదనామక్రియ తా॥ ఆట.

వినవప్ప । శివశంభులింగా । నీవువినకున్నవినరేమి ।
పార్వతీ । గంగా ॥విన॥
నిరతమునినునమ్మినాను ।
నీస్మరణజేసెటిజ్ఞానంబాసగుమన్నాను ॥విన॥
మనసునిల్వాదునిల్పులింగా । నామనసందునీవన్న ।
నిలిచుండులింగా ॥విన॥
వెండికొండనుఎట్లుచూతు ।
ఈకండ్లచూపులో చూపుకొంతనిల్వాదు ॥విన॥

త్రికుటాద్రిననుజేర్చులింగా ।
ఆత్రివేణిసంగముదాటించులింగా ।
ఎటువలెపూజింతునిన్ను ।
నాఘటమందుఎచ్చోట గన గొందునిన్ను ॥విన॥
అభిషేక మెటుచేతులింగా ।
నాకభయమిచ్చియుబ్రోవు నాభావలింగా ॥విన॥
త్రిగుణాతీతుడవయ్యానీవు । మాత్రిగుణాత్మఆత్మపై ।
నిలచియున్నావు ॥విన॥
భక్తవత్సలమూర్తిలింగా । నీభక్తిఅజీముకు ।
జ్ఞప్తివుంచులింగా ॥విన॥

## 44. కీర్తన – రా॥ కాంభోజి తా॥ ఏక.

ఏడుకొండలమీద । వెంకటేశ్వరుడున్నాడు ।
చూడపోదముపాండి । మమ్ములరమ్మన్నాడు ॥ఏడు॥
ముడుపులన్నియువెంటకట్టుకరమ్మన్నాడు ।
మడిచ్చిపెట్టెలోపెట్టి । మరిచిరావద్దన్నాడు ॥ఏడు॥
గల్లలోవేసినడబ్బు । తియ్యవద్దంటన్నాడు ।
గల్లవాడినవారు । వడ్డీఇవ్వండన్నాడు ॥ఏడు॥
వట్టిమొక్కులుమాకు । మ్రొక్కవద్దంటన్నాడు ।
కట్టిముడుపులుపెట్టి । మొక్కులుమొక్కండన్నాడు ॥ఏడు॥
రెండుపట్టాలదారి । నడచిరమ్మంటన్నాడు ।
దండిగుండ్లనుదాటి । తిరుపతిరమ్మన్నాడు ॥ఏడు॥
ఏడుకొండలమీద । సూటిగరమ్మన్నాడు ।
జోడుజ్యోతులపైన । తానువుంటనన్నాడు ॥ఏడు॥

నిలచిభక్తులమది । యందెవుంటనన్నాడు ।
పిలచెవారితో అజీం । పలుకుచుంటనన్నాడు ॥ఏడు॥

45. కీర్తన – రా॥ హిం॥ తోడి తా॥ రూపకము.

తగనిదిమదికిదిరోగము । తగులబెడితివయ్యాగురుడ ॥తగ॥
తగులుకున్నదయ్యామదికి । సొగసగుఓంభూత మొకటి ।
ఇగతాళనుప్రభువరనే । పగతీర్చుకోవయ్యానీవు ॥తగ॥
బాగుగజెపితివిమంత్రము । వేగమెపారెను దేహము ।
వాగుచునున్నది । ఘున్నున । దాగుదునేనిక నెచ్చట ।
నిగనిగమొగమునుపీల్చెను । ధగధగమండెనుకన్నులు ।
తగునాఇటువలెహాస్యముచేయుట ।
మగువలుచూడగఇలలో । గురువరా ॥తగ॥
ఆరిటిబంధనచేసియు । చోరులవేరుగదీసియు ।
షూరులముఛ్వారినిలిపియు । తిరుగుటనేమముచేసియు ।
అరమరలేకఅజీముకు । వరమునొసంగినవారే ।
అరుదాబిరుదిదిగురువరా ॥తగ॥

46. కీర్తన – రా॥ హిం॥ తోడి తా॥ ఆది.

మనమదిశ్రీహరిగదిరా । సుజ్ఞానులకే తెలియునురా ॥మన॥
తానేఆత్మా । తాపరమాత్మ । తా నేతత్వాతీతప్రభురా ॥మన॥
ఇంటికిమింటికిసూత్రధారి । జంటబాయకనుండునురా ॥మన॥
స్వేష్టానిష్టాచారములేనిదే । దృష్టికిదెలియదుమహిమంత ॥మన॥
తనుమనుధనముల । ఆశలోచిక్కి । జన్మవృధాఅజీం ।
గడ్డచెనుఅంత ॥మన॥

47. కీర్తన - రా॥ బేగడ తా॥ ఆట.

గరుడపక్షినికానకున్నావు । ఓగారడ్యోడ ।
పాములనుఆడించుచున్నావు ॥గరు॥
అరుదుగనునీనాగస్వరమును ।
మురియుచునువాయించుచున్నవు ।
నరులకెల్లనుఆటచూపుచు ।
పురముపురమునుతిరుగుచున్నవు ॥గరు॥
పుట్టలోపలవుండెశేషుల । పట్టిబుట్టిలోకప్పియుంచియు ।
అట్టునిట్టులకదులనివ్వక । పొట్టనింపుకొనుచునున్నవు ॥గరు॥
కన్ను చెదిరితె నిన్ను కరుచును ।
కన్నునిలిపియు చూచుచుండుము ।
చిన్నగిటుఅటువూగుచున్నవి ।
ఎడమకుడికవి భుస్సుమనుచును ॥గరు॥
ఏడుకొండలుదిరిగి దినమును । జోడుబాయకవుండెశేషుల ।
తోడుచేసుక వేడ్క చూచుచు। ఎంతయోఆనందమందెడు॥గరు॥
పనికిమాలినపాములనుకొని । పాలుపొయ్యక పెంచుచున్నవు ।
ఘనముగనుపశుపతియుమెచ్చిన ।
శిశువులనియును తెలియలేకను ॥గరు॥
నాగస్వరము వాయించుచున్నవు । నాదమింక అజీముఎరుగవు ।
వేగగురువును ఆశ్రయించియు ।
గుట్టుఏమో తెలుసుకొమ్మిక ॥గరు॥
ధరణిసర్దార్ నగరపురవర । సంతలోసేతిరుగుచున్నవు ।
ఘరఛియాశివనామస్మరణ । పరులనుధూంభించుచున్నవు॥గరు॥

## 48. కీర్తన - రా॥ కేదార తా॥ ఏక.

ఎప్పుడంటప్పుడే । గప్పగప్పకొట్టుడే ।
చప్పుడింకెవ్వరన్న । సిగ్గతదప్పుడే ॥ఎప్పు॥
రెప్పముయ్యనివ్వడే । గొప్పదొంగలింగడే ।
ముప్పొయెఇంటికీడు । పట్టబోతెదొరుకడే ॥ఎప్పు॥
చప్పుడొచ్చినప్పుడే । చవులతోవినడే ।
చెప్పనోరురాదుగాని । నిక్కినిక్కిచూచుడే ॥ఎప్పు॥
తప్పిపోనివ్వడే । అప్పసోహమంటడే ।
రప్పరప్పనెత్తికొట్టి । చెప్పకుండవురుకుతాడే ॥ఎప్పు॥
తప్పమందిదెంచుడే । తప్పతనదెరుగడే ।
తప్పలన్నిమన్నించ । అజీమున్నదొక్కడే ॥ఎప్పు॥

## 49. కీర్తన - రా॥ కాంభోజి తా॥ త్రిశ్రగతి.

పంఢరిపురముకె బండోడ। బండింకకట్టోయిబండోడ ॥పంఢరి॥
మెండైనరెండెడ్లబండోడ । బండికికట్టోయిబండోడ ॥పంఢరి॥
రెండుపగ్గాల్ వెట్టి । ఎడ్లకొమ్ములుకట్టి । రెండెడ్లమెడమీద ।
కాడిబిగ్గరకట్టి । రెండుపగ్గాల్బాగ । చేతఅమరబట్టి ।
రెండెడ్లగుమ్ములమధ్య । దృష్టినిపెట్టి ।
విఠల్ విఠల్ యనుచుమమ్ము ।
పంఢరిజేరోచ్చొయిబండోడ ॥పంఢరి॥
కొండగుహల్దాటి । మూలధారంబెక్కి । దండిగుండ్లనుదాటి ।
బ్రహ్మాధారంబెక్కి । బండెక్లెకొట్టోయి । బండినొగలనెక్కి ।
కండ్లమూయకచూపుచూడోయి ।

ఇగనిక్కి । విఠ్ఠల్ విఠ్ఠల్ యనుచు ।
మమ్ము । పంఢరి జేరోచ్చియి । బండోడ ॥పంఢరి॥

ఈరెంటిపై యెక్కి । మిట్టయున్న దిచూడు ।
దారిచుట్టుతిరిగిపోవుచున్న దిచూడు ।
ప్రేరైనమణిపూరకము । వున్నదదిచూడు ।
చోరులాగ్గురుయుండె । స్థళమైయున్న దిచూడు ।
విఠ్ఠల్ విఠ్ఠల్ యనుచుమమ్ము । పంఢరి కె జేరోచ్చియి ।
బండోడ ॥పంఢరి॥

దాపటొల్పటిఎడ్లపగ్గాల్బిగ్గరపట్టి ।
మాపటికవహోతమువద్దఎడ్లనుకట్టి ।
మాపేవిశుద్ధము । మార్గముకని పెట్టి ।
ఓపికతోబండి । ఆగ్నేయమునకొట్టి ।
విఠ్ఠల్ విఠ్ఠల్ యనుచుమమ్ము। పంఢరి జేరోచ్చియిబండోడ॥పంఢరి॥

పొద్దుపొడువకముందు । గంగాయమునాయందు ।
ముద్దుగాస్నానముచేయించినీవందు । దిద్దితిలకమునొసట ।
బండికట్టిముందు । సద్దుచేయకభజన । చేయుచుగుడియందు ।
విఠ్ఠల్ విఠ్ఠల్ యనుచుమమ్ము । పంఢరి జేరోచ్చియి ।
బండోడ ॥పంఢరి॥

పుండరీకాక్షునిపూజనచ్చటచేసి ।
పిండివంటలతోటినైవేద్యమునుజేసి ।
రెండుజ్యోతులునిల్పి । హారతియునుచేసి ।
దండిగుహలాదారి । అజీము వేంచేసి ।
రాండిసర్దార్ నగరమునకు । మళ్లి పోదముబండోడ ॥పంఢరి॥

50. కీర్తన – రా॥ కన్నడ తా॥ ఆది.

ఘనఘనారణ్యముల । జననిసీతఏడ్పుల ।
వినివినిమృగముల । జనని జేరెవగపుల ॥ఘన॥
తనప్రాప్తంబును । తా । దూరుకొనుచుసీత ।
కాననములోనేలబడి । ఏడ్చుచుండెసీత ।
తనపతిశ్రీరాముడే । తనకుశత్రుడాయె ।
తనమరదేలక్ష్మణుడు । కానలోదలిపోయె ॥ఘన॥
రజకునిమాటవిని । రాముడిటులచేసె ।
నిజమోకల్లయోబ్రహ్మ । నొసటఇటులవ్రాసె ।
ప్రజలయందురామసీత । రద్దిఅయ్యిపోయె ।
కుజనులకు । సుజనులెల్ల । శిరమువంచనాయె ॥ఘన॥
వెతకివెతకిలంకజొచ్చి । నన్నుతెచ్చిరామ ।
సతిపై ఇటునిందమోప । న్యాయమేనరామ ।
క్షితిలోఈసీతబ్రతుకు । వ్యర్థమైపోయె ।
పతివదలినసతికిఇక । చావురాకపోయె ॥ఘన॥
దశరథమహారాజునకు । కోడలయ్యినేను ।
దశదిశలందుప్రఖ్యాతి । అయ్యినేను ।
కుశలమెరుగరామ । నా । శోకమధికమాయె ।
దశలున్నకర్మనా । చేతచేయనాయె ॥ఘన॥
మృగములుజగదీశ్వరునికి । ప్రార్థనలుచేయగా ।
జగధీశుడుమృగములకు । ఆజ్ఞనపుడునొసగగ ।
జగతేలెసీతమ్మకు । మాటపలుకులాయె ।
తెగతెగమృగములు । బాగచెలిమిఆయె ॥ఘన॥

శోకమేలనమ్మనీవు । లోకమాతవమ్మా ।
శుకపికరవములిని । పండ్లుభుజించమ్మా ।
ఏకచక్రవర్తిగృహము । నీగర్భమాయె ।
సకలబాధలుఇక । నిన్నువదలిపోయె ॥ఘన॥
వాల్మీకాశ్రమమునకు । పోవుదమేతల్లీ ।
కాల్బలములుమృగములెల్ల । వెంటవచ్చుతల్లీ ।
నిల్వవలదునీకు । నవమాసములైపోయె ।
లోకమేలెపుత్రుడుఇక । నీకుకల్గనాయె ॥ఘన॥
లెక్కలేనిమృగములెల్ల । దారిపూడ్చుచుండె ।
చక్కగఆమార్గమున । సీతపోవుచుండె ।
గ్రిక్కనవాల్మీకముని । దరిశనంబాయె ।
నిక్కముగమునికిసీత । కూతురైపోయె ॥ఘన॥
సీతామృగములకథ । బుధులతోవినిఅజీం ।
శక్తికొలదికీర్తనవలె । వ్రాసెదీనుడీఅజీం ।
సీతాపతిరాములకు । వ్రాతతప్పదాయె ।
కథసర్దార్‌నగరమందు । జనులుచదువనాయె ॥ఘన॥

51. కీర్తన – రా॥ దర్బార్॥ కన్నడ మిశ్రము తా॥ ఏక.

సాకారమేసంపూర్ణతే । నిరాకారమైనిలుచునురా ॥సా॥
ఆకారమేఓంకారంబై । త్రిలోకములుసృష్టించేనురా ॥సా॥
సాకారంబెనిరాకారమై । నిరాకారమెఓంకారంబై ।
అకారఉకారమకారమనునది ।
మూడక్షరములుముల్లోకంబై ॥సా॥

నిరాకారమునఓంఉత్పత్తై | త్రిమూర్తులయ్యెత్రిలోకమయ్యె |
త్రిశబ్దకర్త త్రిగుణాతీత | సర్వముతానెనిండియుండగ ॥సా॥

కన్నులుచూచుచువీనులువినుచు |
జిహ్వాతోబల్కుచునాసికపీల్చుచు |
అన్నిటతానే | అన్నియుతానై |
వున్నవిరాటుదెలీలని తెలియగ ॥సా॥

ఊపిరుండగపాపిజీవుడ | రాపుజేయకగురుకడజేరిక |
నీవేదిక్కని వేడుఅజీముకు |
తావుననిలుపునుమనుసుకునిక్కము ॥సా॥

## 52. కీర్తన – రా॥ కేదారగౌళ తా॥ రూపకము.

ఆత్మసాక్షాత్కారమైన | వారేధన్యులు| నిజముగజగమున॥ఆ॥

ఆత్మసాక్షాత్కారమయ్యె | అంతరాత్మనెరిగితిరిగి |
పరమాత్మునిధ్యానించెటి | వారే | ధీరులు | శూరులు ॥ఆ॥

మూలధారమూలమెరిగి | బ్రహ్మధారమీద వెడలి |
మణిపూరకమందు మునిగి | తేలినవారే | పుణ్యులు ॥ఆ॥

అందుపై విశుద్ధమెగరి | ముందుదారిసూటిఎరిగి |
పొందుగానుఈశ్వరునకు | వందనమందురుభక్తులు ॥ఆ॥

ఆగ్నేయమెగసిపిదప | సుజ్ఞానపుత్రికుటిజేరి |
సౌజ్ఞలోఆత్రిపురహరుని | తిరిగినవారేయోగులు ॥ఆ॥

పిల్లలాటకాదజీమది | అల్లమహాప్రభులీలచూడు |
యుల్లమందునగనితత్వము | త్వంపద | తత్పదమెరుగుట ॥ఆ॥

53. కీర్తన - రా॥ భీంపలాస్ తా॥ ఆది.

అలంపూరుఇదేకదా । చాలప్రఖ్యాతామెగద ।
బాలాబ్రహ్మేశ్వరస్వామిగుడి । మహాస్థళంబని తెలిసెగద ।
ఓ॥ అంతర్ గంగా । జ్యోతిర్లింగ । మనసా । చూడగరాదా ।
దక్షిణకాశిదిగాదా ॥అల॥

హిందుసహోదరులందరు । పొందుగఇచ్చటవచ్చెదరు ।
అందరుబ్రహ్మేశ్వరస్వామికి । పూజలుభక్తితోచేసెదరు ।
ఓ॥ ఇచ్చటఅంబాజోగుళాంబ । మనసచూడగరాదా ।
దక్షిణకాశిదిగాదా ॥అల॥

తూర్పునతుంగభద్రనదీ । పడమటఅలంపురంబది ॥
ఉత్తరమున్నది । కుడెల్లిసంగము । దక్షిణమున్నదిఅదేనది ।
ఓ॥ త్రివేణిసంగముఅందేలింగము । మనసాచూడగరాదా ।
దక్షిణకాశిదిగాదా ॥అల॥

త్రికర్ణశుద్ధిగజేయవు । త్రికుటాద్రెక్కనేర్వవు ।
త్రికాలసంధ్యజేసెవుపము । గురువుతోమనసానేర్వవు ।
ఓ॥ గంగాస్నానము । చేసెస్థానము । తెలుసుకమునుగ గరాదా
పాపనాశిదిగాదా ॥అల॥

ఎంతపుణ్యస్థళంబిదీ । వేదాంతరహస్యము తెలుపునది ।
చింతలొందలేకాంతములుంటె । జ్యోతిజూపులింగమది ॥
ఓ॥ చంచలమనసా । అచలంబైతె । నిశ్చలతత్వముగాదా ।
శివశివయనుకొనరాదా ॥అల॥

మహాశివరాత్రి శుభదినము । బ్రహ్మేశ్వరనిరతోత్సవము।
జిహ్వా తెలిపినవైభవముంటె । చూచెవారికిఆనందం ।

ఓ॥ అజీంధడాఖ వ్రాసినపాట । నిజమగుతత్వముగాదా ।
సుజనులుచదువగరాదా ॥అల॥

54. కీర్తన – రా॥ శంకరాభరణము తా॥ ఆట.

తారకమునాల్గక్షరములన్నా । ఈతారకామృత ।
సారమేఇకగ్రోలవలెనన్నా ॥తా॥
తారకముఅనెఅక్షరములు । నాల్గునిజమనిచూడుమనసా ।
మీరకనుగురువాజ్ఞపీటిని । నమిలిసారముమ్రింగుమనసా॥తా॥
తాకుమొదటనెవిరచికొరకి । రాకుపిదపనమిలిచూచి ।
కాకుకుడిచినపొట్టనిండును । మాలోమునిగి తైముక్తుడన్న॥తా॥
తారకంబనెఅక్షరంబులు । అర్ధమెరుగుటకష్టతరము ।
తారకమునుతరించెమార్గము । గురువుతోఇక నేర్వమన్న ॥తా॥
మాటిమాటికితారకంబనే । మాటకోటలుదాటుచున్నది ।
తాటిచెట్టుప్రిమాణమెగిరిన । సూటిగానవిమనసవన్న ॥తా॥
తారకముతరించలేక ।. దూరుచుండుఅజీముమనసుకు ।
తారకమునుతరించెవారి । పాదములకుమొ్రక్కుచున్న ॥తా॥

55. కీర్తన – రా॥ కమాచి మిశ్రమ తా॥ ఏక.

రాండీరాండీఅందరము । రాములభజనచేయుదము ।
మనసేమనదీమందిరము । భక్తితోభజనచేయుదము ॥రాండీ॥
సోహంకస్త్వంబరయుదము।సోహంవింటుఅంటుందాము॥రాం॥
కుడిఎడమలకుతిరుగుచును। మూడువేణులతోగూడుదము॥రాం॥
తాఎచ్చటనోమాఎచ్చటనో।రహస్యమెరగిరమింతాము॥రాం॥

రాగము తాళము చిటికెలను ।
బాగుగవాయించుచువ్వృసంగము ॥రాండీ॥
ముక్తిమార్గంబిది యెఱజీం । శక్తితోనడచుచుపోపుదము॥రాం॥

56. కీర్తన - రా॥ యమునాకల్యాణి తా॥ జుల్వ.

నేనారాముని ధ్యానించుట । ఇలనీవామనసా ।
నేనారాముని ప్రార్థించుట । ఇలనీవామనసా ॥నేనా॥
ఒకస్థానంబున నే । పుట్టియు పెరిగి మేము ।
సకలాబాధలు । నావంతెకదా । నీవామనసా ॥నేనా॥
మనఆకారంబెఇలా । సాకారములాయెకదా ।
వినికనుచున్నది । అది । ఏదియో తెల్పుమనసా ॥నేనా॥
నీకాధర్మఅధర్మంబులుగనెశక్తియుక్తి ।
నాకీకర్మలుఇవి । నీకును లేవామననా ॥నేనా॥
త్రిగుణములున్నవట । నీమదినిమీఁడీనిండీ ।
త్రికర్ణశుద్ధిగనే । చేయుటనీవామనసా ॥నేనా॥
ఇహపరసౌఖ్యములు । నీకునునాకున్నవిగా ।
సహజముఏదోఅజీం । తెల్పుడు । తెల్పుడుమనసా ॥నేనా॥

57. కీర్తన - రా॥ కాఫి తా॥ ఆది.

మనస రాముని ధ్యాన్నము చేయవు ।
నను రామాఅనని వ్వవుగా ॥మన॥
ఘనమగుసదనము । హృదయములున్నది ।
గానవుననుగననివ్వవుగా ॥మన॥
మధురమైన రామరసము । సారమునుఇకగోలుమా ।

ముదమునను మదిరాముని। నాట్యము। ఆడవునను ఆడనివ్వవుగా॥
నిష్ఠ జేసె క్రమముగురువును । ఆశ్రయించి తెచూవుసుమ ।
దుష్టగుణములు వదలవునీవు । నన్నునువదలగనివ్వవుగా ॥మన॥
గొప్పఅధికారీవిపురికీ । తప్పుతో వలునడువకుమా ।
తప్పుశిక్షవిధించీపరులకు । ననువప్పనిఅనివచియింతువుగా॥మన॥
నీ వేనాన్యాయాధిపతివి । నీ వేనాకధిపతితవుగా ।
నీవుత్రివిధస్వరూపములుగ । సత్యగుణంబుననడుపుసుమా॥మన॥
సత్ చిత్ ఆనందమంత । సత్వరజోతమగుణములుగా ।
సతతముమదిలోఅజీముధ్యాన్నము ।
చేసియునను జేయింతువుగా ॥మన॥

58. కీర్తన – రా॥ ఆనందభైరవి తా॥ ఆట.

వెయ్యరా మోడీ వెయ్యరా ।
గురుపుత్రులంత । వెయ్యరా । మోడీ వెయ్యరా ॥వెయ్య॥
అయ్యగారికటాక్షమొందిన । సోదరీసోదరులుఎల్లరు ।
అయ్యమోడినితలచిఇంకా । మాయలన్నీవదలిమీరు ॥వెయ్య॥
తనుమనంబుధనంబిచ్చి । అనివినిమరికనుటనేర్చి ।
జననమరణముఖేదమొదలి। తానెతత్వంబనుచుమీరు॥వెయ్య॥
మూడురెండ్లనుమూసివేసి । జోడుజ్యోతులమెలగజేసి ।
నాడులన్నిటినిలిపివేసి । ఏడుకొండలుఎక్కిమీరు ॥వెయ్య॥
సూర్యచంద్రునిమధ్యనిలచి । తారచూచుటగగనమెగసి ।
నూరుఎందుకుఓంశబ్దం । శంఖునాపూరించిమీరు ॥వెయ్య॥
గురువుచెప్పినగుట్టువదలి । పరులపదవికిఆశపడుచు ।
ధరనుసర్దార్ నగరమందు । నిలచియున్నఅజీంధడాఖ ॥వెయ్య॥

59. కీర్తన - రా॥ జంఝూటి తా॥ ఏక.

ఎంత భాగవున్నదన్నా । రామనామభజన ।
చింతలొదలివిన్నకన్న । జిహ్వాతో అనుకున్న ॥ఎంత॥
శివశివయని ఓం । నమశ్శివాయయని ।
శివరామనామమధురం । భక్తులెల్ల గోలుచున్న ॥ఎంత॥
అంగమందులింగస్థానం । శివాలయంబది ।
అంగభంగముచేసేలింగ । భక్తులారచూచుచున్న ॥ఎంత॥
గురుబోధలైనవారు । గురుబోధకానివారు ।
హరిహరభక్తులంత । మిత్రులైయున్నరన్న ॥ఎంత॥
సర్దార్ నగరం । గ్రామమందు । వీరాంజనేయగుళ్లో ।
సర్వాత్ములుగుమిగూడి । రామధ్యాన్నముచేయుచున్న ॥ఎంత॥
అజ్ఞానంబుత్రోసివేసి । సుజ్ఞానంబునొసగురామ ।
ఆజ్ఞబద్ధుడైనఅజీము । మొరాలకించుమన్న ॥ఎంత॥

60. కీర్తన - రా॥ కల్యాణి తా॥ రూపకము.

రామకృష్ణయననిజిహ్వా । ఉండుటెందుకో । జీవా ॥రామ॥
కష్టంబనకనుతప్పక । సరిగరిసరినిసలంటది ।
ఇష్టంబైనటుసీనిమ । పాటలుపాడుచునుంటదీ ॥రామ॥
నేటుగసంగీతపరుల । పట్టుకవర్లుచుచుంటది ।
నిష్ఠాధ్యానంబెరుగక । తులువాపలుకుచునుంటది ॥రామ॥
మనసంటెనెకద ఈజిహ్వాయు । అటులనుచుంటది ।
వినిజిహ్వాతో ఈతనువిది । గప్పానవినుచుంటివికద ॥రామ॥
అన్నదివిన్నదిఅన్నీ । కన్నులేకనుగొనుచుండును ।
పన్నగశయనాముఖ్యాలు । ఎవరో కానను నేనిక ॥రామ॥

ఈషణాత్రయములచిక్కిన । దూషణజిహ్వాకుచేసిన ।
ద్వేషము:లొదలించవె । నాపోషణకర్త్రువనీవిక ॥రామ॥
ధరసర్దార్ నగరములో । నిరతముఅజీంధడాఖు ।
మరువకనినుదలచునట్టి । జ్ఞానంబొసగుట మొరలిడే ॥రామ॥

61. కీర్తన – రా॥ మాండు తా॥ ఆది.

కదులదుపామదీ । పుట్టలోయున్నదీ ।
భుసగొట్టుచునే । యున్నదిరా ॥కదు॥
ధరపైతోకయులేదెటుపట్టుదు ।
శిరమాకాశం । పై ఎటుకొట్టుదు ।
హరిహరఫణికెటు । ఆరడిపెట్టుదు ।
తరుముచుదానికి । ఎటువెలినెట్టుదు । జీవా ॥కదు॥
పుట్టలొనడుమది । కూర్చొనియున్నది ।
ఘట్టిగకుండలివేసుకయున్నదీ ।
చుట్టదిదిశలంజూచుచునున్నది ।
నిష్టాజేసెడి । స్థలమునయున్నదీ । జీవా ॥కదు॥
గృహామునమబ్బులో । గువ్వానదుమికితి ।
సోహాంబనురోకలిచేబట్టితి ।
మోహాంబున । ఆపామునుజంపితి ।
కోహాంకస్వ్యంభావంబొదలితి । జీవా ॥కదు॥
దక్కితిచంపితి । పామునునేనని ।
ఎక్కితిపుట్టను । నిక్కిచూచితిని ।
చక్కనివెన్నెలచుక్కలరాయుని ।
పక్కణమునమున । పరబ్రహ్మకళ । జీవా ॥కదు॥

గురువరపుత్రిశాస్త్రి నునువారికి ।
హరిహరభక్తసమాజమువారికి ।
నిరతముభజనజేసెటివారికి ।
శరణనిమ్రొక్కెఅజీంధడాఖ । జీవా ॥కదు॥

62. కీర్తన - రా॥ అరభి తా॥ ఆట.

కృతఘ్నుడను నేను రామా ।
ఘోరాపాపాత్ముడను నేను రామా ।
ధరణీలోవరు లెల్ల భజన । చేయుచునుండ ।
వారికెల్లను నేను । వెక్కిరించుచునుంటి ।
ధర్మమొదలిఅధర్మంబూని । సత్యవ్రతులనసత్యులంటిని ।
సర్వకాలమునీదుస్మరణ । జేసెవారలకష్టపెట్టిన ॥కృ॥
శాంతికొంతయురానెరాదు । రామా ।
భ్రాంతినామదివదలిపోదు ।
శాంత లెచ్చటనున్న చూచి । దూషింతును ।
అంతు తెలియని వెన్నో । దుష్కర్మ లేయుండె ।
పంత మొదలనివృత్తులన్ని । చెంత జేరెనువదలిపోవు ।
వింతలన్ని విన్న వారలు । పాదరక్షతొకొట్టుచున్న ॥కృ॥
నాపాప్రప్తమిదియేమొ రామా ।
ఇట్లుముద్రించె । నొసటిపై బ్రహ్మ ।
ఈపాప్రప్తమునుదుడిచి । జ్ఞానలేఖయువ్రాసి ।
ఆపదలనుబాపు । నీపాదములువిడువ ।
భేదభావముపూనినే । నజ్ఞానమనెడికత్తిబట్టితి ।
వదలగొట్టుఅజీము నేడు । వదలదదియజ్ఞానఖడ్గము ॥కృ॥

### 63. కీర్తన - రా॥ కాంభోజి తా॥ ఏక.

శంభుశంభుశంభుశంభు । శంభుశివశంకరా ।
శంభుఅల్ల మహాప్రభు । జగమెల్లనీవెరా ॥శంభు॥
మొరాలకించిమమ్ము । కరుణతో బ్రోవరా ।
త్రికాలవాసిశంభు । త్రిశూలధరహార ॥శంభు॥
మండలధిపతిత్రిశబ్దకర్త । త్రిగుణాతీతప్రవిమలఓంకార ॥శంభు॥
నీవుతప్పఇతఃపర । వేల్పులన్నికల్లరా ।
కావుమయ్యనన్నుఅజీం । నీవేజగదీశ్వరా ॥శంభు॥
సద్దారునగరభక్త । సమాజపోషఘన ।
దయార్ద్రిహృదయజ్ఞాన । దాయకత్రిపురహార ॥శంభు॥

### 64. కీర్తన - రా॥ మోహాన తా॥ జుల్వా.

జై దేశికేంద్రిమీకు । జయమీమంత్రమహిమలకు ॥జై దే॥
నేనేకదగురుపుత్రుడ । నేనేకదమీదాసుడ ।
నేనేమీదుపదభృత్యుడ । నిరతముమిమునమ్మియుంటి ॥జై దే॥
ధరతారకమంత్రమదియే । స్థిరముగతరియించునటుల ।
వరమొసగినవారెమీరు । గురునాథాదీనపోష ॥జై దే॥
జ్ఞానధ్యానమునుసమాధి । స్నానస్థానస్వేష్టసిద్ధి ।
సూన్యాసనంబునందు । గనుమనిరాదృక్కునందు ॥జై దే॥
గంగయమునసరస్వతీనది । సంగమవ్యోమస్థళమదిఇది ।
అంగమెల్లభంగపరచి । లింగమంతుజూడుమన్న ॥జై దే॥
గురుకుమారస్వామిఇట్టి । తరగనిఆస్పదమునొసగి ।
సద్దారునగరమున । అజీం । హరిధ్యానముచేయుమన్న॥ జై దే॥

65. కీర్తన – రా॥ భీంపలాస్ తా॥ ఆది.

కల్ల నిజమాయెగా । కోరికతీరెగా ।
సాటివారునవ్వుచుండ । తల్లడిల్ల నాయెగా ।
ఓ...గిరులుచూచె। మృగములుబలికె। చిత్రముకాదారామా।
చిత్రముకాదారామా ॥కల్ల॥
ప్రాప్తమిటులాయెగా । ప్రేమలోదలిపోయెగా ।
ప్రేమగల్ల మరదినన్ను । కానలోదలిపోయెగా ।
ఓ...రజకునిమాటరాజులువప్పుట । చిత్రముకాదారామా ।
చిత్రముకాదారామా ॥కల్ల॥
రామరాజ్యంబాయెగా । రాజసగుణములుహెచ్చెగా ।
నిర్మలమైనహృదయమునందున। కామక్రోధములొచ్చెగా।
ఓ...రామాయణముపారాయణులకు। చిత్రముకాదారామా।
చిత్రముకాదారామా ॥కల్ల॥
అజీముఇట్లువ్రాసెగా । సుజనులకెల్లదెల్పెగా ।
రుజువులేనివార్తలెల్ల । ప్రజలువప్పినారుగా ।
నాటకమాడిరిసర్దార్నగరులో । చిత్రముకాదారామా ।
చిత్రముకాదారామా ॥కల్ల॥

66. కీర్తన – రా॥ గరుడధ్వని తా॥ ఆట.

శివశివాయనియందునా । నిను । కేశవాయనియందునా ।
దేవుడాయనియందునా । శ్రీరామకృష్ణాయందునా ॥శివ॥
ద్వైతమొదలుకుందునా । అద్వైతమునసిలచుందునా ।
వేదశాస్త్రపురాణములను । చెవులతోవినుచుందునా ॥శివ॥

పూజఎవరికిచేసుకుందును । పూజ్యులెవరనియందును ।
పూజఅర్థమెపూజయున్నది । పూజనేనైయుందును ॥శివ॥
నిరంజనాయనియందునా । నిరూపుడాయనియందునా ।
విరాట్స్వరూపుడవై నిలచిన । లీలనీదనుకుందునా ॥శివ॥
నీవునీవనుచున్ననన్ను । కావుదీనపోషణ ।
నీ వెల్లమహాప్రభో । అజీమటంచునుతలుతునా ॥శివ॥

67. కీర్తన - రా॥ మిశ్రమ బిళహరి తా॥ ఏక.

నిన్నేధ్యానించవలె । ఈశ్వరా । జగదీశ్వర ।
నిన్నేప్రార్థించవలె । ఈశ్వరా । జగదీశ్వర ॥నిన్నే॥
మానాభిమానములొదలి । స్నానముగంగాయమునలోచేసి ।
స్థానములున్నమురుకులనూడ్చి । గానముశంభోయనుచుచేసి ।
పూనిక రేచకకుంభకపూరక । తోడుత ।
ఓంశబ్దమునుపూరించి । పూరించి । మించి ॥నిన్నే॥
ధ్యాసలన్నిసున్నచేసి । ఆసనంబును । తనువునుచేసి ।
నివాసమందునమనస్సుచేసి । మోసపోకనుశంభో ।
శబ్దం । పూరించి । పూరించి ॥నిన్నే॥
మూలాధారంబేదోతెలసి । కేలుమోడ్చుకఅచ్చటనిలచి ।
మూలలోగణపతికొలువునుకొలచి ।
మేల్కతోబ్రహ్మాధారంబందున ।
శంభోశబ్దం । పూరించి । పూరించి ॥నిన్నే॥
గ్రక్కునవదలియుబ్రహ్మాధారము ।
చక్కగచేరియుమణిపూరకము ।

